



# స్వరాజ్య సాధము



గ్రంథకర్త:
రైతుకవి పురిజాల వెంకటప్పారావు

ప్రింటర్సు:
శ్రీ గాయత్రి ప్రెస్, శ్రీకాకుళం.

1949

# స్వరాజ్య సౌధము



గ్రంథకర్త:

రైతుకవి పురిజాల వెంకటప్పారావు

కృతిభర్త:

గౌ॥ పైడి నరశింహప్పారావుగారు





వెల 1—0—0

# కృతిభర్తప్రసంశ



పైడివంశాబ్ధిసోముండు భవ్యగుణుడు
నారశింహప్పరాయుఁడు సవ్యయశుడు
సంపదలనంది స్వారాజ్యసౌధమందు
అంచితంబుగ తులతూగనెంచి దీని
కృతినిఁగైకొనె బుధులుసమ్మతినిమెచ్చ.

ఇట్లు,

గ్రంధకర్త.

# తొలిపలుకు



సుమారు నూటయాభై సంవత్సరాలు బ్రిటిష్ ప్రభుత్వం మనదేశాన్ని పాలించి మొన్నమొన్ననే దేశ విభజనచేసి స్వతంత్రం యిచ్చింది. యిన్నాళ్ళకు యీస్వతంత్రం వుద్భవించడానికి కారణం కాంగ్రెసు—యీ మహాసంస్థలో అనేకమంది ప్రముఖులు పాల్గొని అనేక కష్టాలుపడ్డారు; కొందరు బ్రిటిష్ ప్రభుత్వం యినపపాదాల క్రిందపడి నలిగిపోయేరు. సంవత్సరాలతరబడి కారాగృహవాసములు అనుభవించేరు. కాని కాలప్రవాహం కట్టులు త్రెంచుకుపోగా, యీనాటికి స్వతంత్రవాయువులు పీల్చగలిగాం. అయితే యీ స్వరాజ్యసౌధం యెలాగ నిర్మింపబడిందో కొంతమట్టుకు నిరూపణచేయడమే యీనాటిక వుద్దేశం. అందులకే యీనాటకమునకు స్వరాజ్యసౌధమని పేరు పెట్టినది. నాటకములో వీలైనంతవరకు తగ్గించుటకు జరగినసంఘటనలన్నియు, సమగ్రముగా చిత్రించలేదు. కాని మొత్తముపైని కాంగ్రెసువుద్భవించినది మొదలు ముఖ్యముగా యేకార్యము చేసినదో, దానిని మాత్రమే ఆధారముగా తీసుకొని వ్రాయడమైనది. మహాత్మాగాంధీనాయకత్వాన కాంగ్రెసు యేవిధముగా నడచినదీ క్రమక్రమముగా స్వతంత్రము యేవిధముగా తీసుకొనివచ్చినది తెలుపబడెను — ఉప్పుసత్యాగ్రహము — గాంధీ యిర్వినుసమావేశము, రౌండుటేబిలుసమావేశము, ఎన్నికలు, కాంగ్రెసు మంత్రిత్వం — క్రిప్సురాయబారము 1942 క్విట్ యిండియా తీర్మానము, దేశవిభజన అట్లీదొర సందేశము— మొదలగు చరిత్రాత్మకవిషయములు మాత్రం తెల్పబడినవి. విషయములు కొన్ని సూక్ష్మీకరించి వ్రాయడమైనది. యీవిధంగా నాటకమును వ్రాసి కాంగ్రెసుచరిత్ర కొంతవరకు తెలియజేయడమయినది.

నాయీనాటకమును, సంపూర్ణముగ విని దీనిని కృతినొందుటకంగీకరించిన కళాహృదయులు, ఉదారస్వభావులు అగు గా॥ శ్రీ పైడి నరిశింహాప్పారావుగారికి నా నమస్సులు — శ్రీ అప్పారావుగారు నిరంతర కాంగ్రెసు సేవాపరులు; 1941 సంవత్సరమున వ్యక్తిగత సత్యాగ్రహంచేసిన దేశాభిమాని; కొన్నాళ్ళు స్థానిక పరిపాలనలో అభ్యర్థిగానుండి ప్రజాదరణ పొందిన సేవాపరుడు. యిప్పుడు దీనిని కృతినంది, తన దేశాభిమానమునే గాక భాషాభిమానమునుగూడ వెల్లడించి స్వరాజ్యసౌధములో తుల తూగనియ్యకొనెను — పరమేశ్వరుడీతనికి ఆయురారోగ్యభాగ్యములనిచ్చి రక్షించుగాక.

ఇట్లు,
గ్రంథకర్త.

# యిందలి పాత్రలు.

శ్రీహరిరావు — (కథానాయకుడు)

కమల — (శ్రీహరిరావు భార్య)

రామమోహన్ — కాంగ్రెసు అధ్యక్షుడు

జయప్రకాష్ — కార్యనిర్వాహక సభ్యుడు

జస్టిసు జగ్గయ్య }
లంచాల రామన్న } ఓట్ల ప్రచారకులు.
అభిమానం అచ్చయ్య }
కాంగ్రెసు కాంతయ్య }

పోలీసుసబ్ యిన్స్పెక్టరు —

పోలీసులు —

వాలంటీర్లు —

# అభిప్రాయము.

మహారాజశ్రీ పురిజాల వెంకటప్పారావు కవిగారికి :-

ప్రియమహాశయా! నమస్తే,

తాము రచించిన "స్వరాజ్యసౌధము" పాఠ గాంచి యెనలేని సంతోషము నందితిని, తాము చిన్నటనుండి దేశాభ్యుదయమునకై యొనరించిన కృషికి ఫలితముగా నీస్వరాజ్యసౌధము నిర్మించుటకు పూనుకొని సంకల్పసిద్ధులైతిరి. దేశకవితయందు, అందుముఖ్యముగా, రైతు, కూలి ఇత్యాది సమస్యలయందు మీకవిత్వము గొప్పగాపనిచేసినది. మీరురచించిన హరికథలును ఇతరగ్రంథములును, ఆనందదాయకములై దేశమునకు నూతన చైతన్యముగూర్చుచున్నవని వ్రాయుటయందు నేను సందేహింపను. మీ యీగ్రంథము త్వరలో ముద్రాపితమై ఆంధ్రదేశమంత వ్యాపించి ఇతోధికముగా మీకృషి వెలయుచుండునట్లు పరమేశ్వరుడనుగ్రహించుగాక! ఇవియే నాధన్యవాదములు. చిత్తగించవలెను.

ఇట్లు,

పాందూరు } మీమిత్రుడు.

13-7-49 } కవితాకోవిద అల్లంసెట్టిఅప్పయ్యా.

# స్వరాజ్యసాధము



## మొదటి అంకము

### 1 టవ రంగము

(శ్రీహరిరావు గాంధీటోపీనిధరించి, ఖద్దరువస్త్రధారియై, త్రివర్ణపతాక మునుబట్టి రంగస్థలముపై ప్రవేశము.

శ్రీహరి ;— యిది నాభారతభూమి, యిది నాభరతసామ్రాజ్యలక్ష్మి, యిది నాజన్మహక్కు, దీనికొరకై పోరాడుట నావిద్యుక్తధర్మము. గాంధీమహాత్ముని యాదర్శప్రాయునిగా చేకొని పవిత్రించబగు ఖద్దరుదాల్చి త్రివర్ణపతాకమునుపట్టి, శాంతిసమరంబున దుమికి సంపూర్ణస్వరాజ్యముబరయువరకు నాపట్టుదలనువీడను, వీడ బోను. కారణమేమన.

చ॥ కడచుసె ఎన్నడేని చిరకాలమునుండియునేలుచున్న
యీపడమటి యాంగ్లరాజ్యపరిపాలన మాదుస్వరాజ్యలక్ష్మి
చేపడునొకో, దాస్యవృత్తినెడబాయునోలేదో, అదట్లుకానిచో
విడతుమె మాదుపట్టుదలవీడక నెంతుమెమాస్వదంత్రమున్॥

(అనిఆలోచించినట్టు నటించుచు) అవును స్వదంత్ర జీవనము రాకున్న, స్వేచ్ఛావిహారములేకున్న మానవజీవితమునకు, మానవకల్యాణమునకు హాయిలేదు. ఆనందముచేకూరదు. ఎవరా వచ్చుచున్నది. (శ్రీహరిరావుభార్యా కమల ప్రవేశము.)

కమల;-(భర్తను సమీపించి) నాథా యిదిమీకు ధర్మమా! యిల్లువీడి, యిల్లాలనువీడి, బిడ్డలనెడబాసి, యుద్యోగమునకు స్వస్తిచెప్పి, దేశసేవయని, స్వాదంత్రమని పట్టుదలనుగొని పలుసార్లు జైళ్ళకేగి మమ్మిట్లొంటరిగా నుంచుట మీకున్యాయమా? యిది మీకు సమ్మతమా?

శ్రీహ:_ఏల వెర్రిదానా! నీవిట్లువాపోవుచున్నావు, స్వదంత్రమననేమో స్వరాజ్యమననేమో నీకర్థముగాక నీవట్లనుచున్నావు. ఎందరు మహానాయకులు దేశసేవలో పాల్గొనిరో! ఎందరుమహాయోధులు

కారాగారమున నిర్బంధింపబడిరో! ఎందరుమహాధీరులు కాంగ్రె సోద్యమున కడగండ్లనొందిరో నీకు తెలియకయిట్లనుచున్నావు.

కమల;-నాధా! మీకీవెర్రి నమ్మకము పోవుటలేదు! ఎంతకాలము మీరీ యుద్యమమునపాల్గొని నిర్బంధితులైన మీకుస్వరాజ్యము స్వదంత్రము సిద్ధించునో నాకు తెలియదు.

శ్రీహ;- తెలియకనే అట్లంటివి, స్వదంత్రమన్న పరరాజులచేత రాజ్యము పరదేశీయుల పరిపాలనముతొలగి మనదేశసౌభాగ్యము మనదేశ కల్యాణమును మనముపొంది మనకీ బానిసత్వమునుండి విముక్తి నొందుట మనరాజ్యము మనస్వేచ్ఛ మన విభవము మనస్వాతంత్రము అందులకే పెద్దలు "సర్వేజనానాం సుఖినోభవంతి" అని వచింతురు తెలిసినదా! అందరిసుఖమే మన సుఖము అందరి స్వేచ్ఛయేమనస్వేచ్ఛ, యీబానిసప్రభుత్వముక్రింద ఎవరికిస్వేచ్ఛ గలదు, చెట్లపై నెగురుపక్షులకు హాయిగ స్వేచ్ఛయున్నది. గాని యీనిరంకుశాధికారములో స్వేచ్ఛలేదు, ముమ్మాటికిని స్వేచ్ఛలేదు. స్వాదంత్రము వచ్చువరకును ప్రతిభారతీయుడు పాటుపడవలెను.

కమ;- ఎప్పటికాస్వరాజ్యము, ఎప్పటికాస్వదంత్ర్యము, ఎన్నియోసార్లు మీరు, మీతోటివారలు నిర్బంధితులైయుండుటయేగాని యిప్పటికి మీకొక తులమెత్తు స్వరాజ్యమొసంగిరా సమాధానమియ్యుడు.

శ్రీహ;-కమలా! అదివారిచ్చునదికాదు, మనరాజ్యము, మనవిభవము మనకు రావలెనన్న దెల్పెదవినుము.

సీ॥ సర్వేశ్వరుండిల సద్వసముంచైన
భారతాంబయె కృపాభరితరైన
దేశనాయకులెల్ల ధీరోత్తములెయైన
సత్యాగ్రహంబిల చాటుచున్న
మహానిరాకరణము మంత్రిరాజ్యంబైన
రాట్నచక్రము మన రక్షయైన
గాంధిదేవుడు మహాకార్యసాధనుడైన
యేకగ్రీవ నొక్కమేకమైన

గీ॥ ఐక్యమతము జగతిలో నలమికొనిన
శాంతిసమరంబునకు ప్రజల్ సరకుగొనిన

వింతపరదేశవస్తువుల్వి డచుకొనిన
రాకయుండునె మనకు స్వరాజ్యలక్ష్మి.

కమ;— సరే మీరుచెప్పినదంతయు సమంజసమేకాని యీ కా రా గా ర వాసమువల్లలాభమేమి ?

శ్రీహ;—అది శ్రీ కృష్ణజన్మస్థానము, అందులకే,

సీ॥ గాంధీమహాత్ముఁడే ఘనకార్యమొనరింప
యెరవాడచెరసాల కేగినాఁడా ?
జవహారుండేభువి స్వాదంత్రమార్జింప
పలుసార్లుజైళ్ళలో బడినవాఁడా ?
దేశభక్తుడు తనక్షీరత్వమునుజూపి
మందునిర్బంధము సందినాఁడో ?
కీర్తింపగానేది కృష్ణజన్మస్థాన
మిలసంచుతిలకెద్ది దలచినాఁడొ.

గీ॥ మోతిలాల్ చిత్తరంజన ముఖ్యులెల్ల
దేశకల్యాణవిభవంబు దివ్యమంచు
జాతియోద్యమమందు ప్రశాంతముగను
జైలుకేగిరో ? యద్దాని తెలియవీవు.

కమ;— అట్లైన మీరు మరల కారాగారప్రయాణోన్ముఖులగుచున్నారా?

శ్రీహ;—కారణమెట్టులుండునో, కా ర్య క లా ప మె ట్లు జ రు గు నో ఏమిచెప్పగలను.

(వాలంటీర్లు ప్రవేశం)

అయ్యాజండాస్థాపనకు వేళయతిక్రమించుచున్నది. మీరాకకు నిరీక్షించుచున్నారు.

శ్రీహ;—కమలా ! అదిగో నాసహోదరులు జాతీయోద్యమ పతాకవందనోత్సవము జరుపుటకు రమ్మనుచున్నారు. నేనిదేపోవుచున్నాను, నీవింటికి మరలుము.

కమ;— (తనలో) మరల యితనికీసారికూడ కారాగారవాసముతప్పదు యిప్పటికి ముమ్మారు నిర్బంధింపబడిరి, యిది నా ల్గ వ సా రి, కానిమ్ము నేనింటికేగి భర్తయుద్యమములో పాల్గొని, నావిద్యుక్త ధర్మమాచరించెద. పవిత్రయగు ధర్మపత్నికి భర్తలననుసరించు మార్గముకన్న వేరుతావులేదు. (అని నిష్క్రమించును.)

## 2 వ రంగము

## ( జాతీయజండాలో వాలంటీర్లు ప్రవేశం )

### పాట

కాంగ్రెసుజండా ఆకాస వీధిని ఎగురుచున్నదల్లదిగో (అనువరస)

1 జాతీయకేతన మంబరవీధిని, జదలుచున్నదల్లదిగో,
జాతికి నీతికి ఖ్యాతికి మూలమహా ॥

2 స్వతంత్రసిద్ధికి సాధనమార్గము స్వజాతిరక్షణకు సకలనిదానము
ధైర్యముస్థైర్యము నిలుపజేయుగల జా॥ తీ॥

( అని వాలంటీర్లు పాడుదురు )

శ్రీహరిరావు — ప్రవేశం ;— సోదర సోదరీమణులారా ! యీ స్వాతంత్రపతాకమునుగూర్చి నాకు తెలియునంతవరకు ముచ్చటించుచున్నాను. యీ జాతీయపతాకమును నన్ను ప్రతిష్ఠింపవలెనను, మీకోరిక శిరసావహించుచున్నాను. సుజలాం, సుఫలాం, సస్యశ్యామలాం అని విరాజిల్లుచున్న మన భరతభూమియందు యీ పతాకము అగ్రగణ్యస్థానమువహించినది. వహింపనున్నది. యీజండాస్థాపన గావించినది మొదలు పరరాజుల పతాకములు లక్ష్యముసేయక స్వతంత్రస్థాపన కాకరంబగు నీపతాకమునకు అనసరమైన ప్రాణంబులుసహితము ధారపోయవలెను. అట్టివీరుడే భారతవీరుడు, కారణమేమున, ఏతేజోమూర్తి జాతీయ సంస్థను నెలకొల్పు మార్గదర్శిగానున్నాడో, ఏ తేజోమూర్తివంతుడు భారతజాతి ప్రఖ్యాతికొరకు పలుపాట్లనొందుచున్నాడో, ఏతేజోగుణరాశి ఖద్దరుప్రాముఖ్యతను రాట్నచక్రసౌభాగ్యమునుగూర్చి విపులపరచుచున్నాడో, ఏమహాగుణనిధి గాంధియనుపేర లోకవిదితమై స్వాతంత్ర సమరమున పోరాడుచున్నాడో. అట్టిపవిత్రమూర్తియే మన దేశనాయకుడు. వినుడు. జాతీయకేతన ప్రాముఖ్యమునుగాంచుడు, ధీరులు కండు, లెండు, వేమేల, అట్టిగాంధిదేవుడు మనపాలిదైవము కాకున్న,

సీ॥ స్వారాజ్యరథమును సాగింపగానెంచి
అసహాయయోగనాశ్వముల బూన్చి
సీమగుడ్డలను నిస్థామంబుగాజేయు
ఖద్దరుకవచంబుగా ధరించి
జతీయయుద్యమసంస్థాపనమునకై
యాత్రివర్ణపతాకమమరనిల్పి

మహీనిరాకరణమహా మంత్రరాజంబును
శంఖారావంబుగా జగతినూది

గీ॥ జవహరునిసారధిగనిల్పి జరుగుచున్న
శాంతిసమరంబునందు ప్రశాంతముగను
రాట్నచక్రముబట్టి స్వరాజ్యమిదిగో
దెచ్చిమీకిత్తుననిగాంధి దెల్పియతడు
ధీయుతుచు వెలసెలె బ్రిటనుగుండియలుసడలె!

ఆతేజోమూర్తి ప్రభావమిట్టిదని మీరుగ్రహించి యుద్యమమున నిర్మగ్నులయి మెలకువతోవర్తించి యీ నిరంకుశాధికారమును తొలగింపుడు.

వాలంటీరు:– జై భారతమాతకు జై, జై గాంధిమహాత్మునికి జై (తెరవ్రాలును) తిరిగి తెరలోనుండి గట్టిగాచదువును – శ్రీహరి రావుగారి యుపన్యాసమునకు, జాతీయజండాస్థాపనకు ప్రభుత్వము వారు సిన్నకోర్టులో విచారణగావించి 2 సంవత్సరములు నిర్బంధించి కష్టంగారు జైలున కంపుటకు తీర్పునొసంగిరి.

1 పోలీసు యినస్పెక్టరు 2 కానస్టేబుల్సు ప్రవేశం.

యినస్పెక్టరు;–అయ్యా, శ్రీహరిరావుగారు, మీయుపన్యాసమునకు, మీ జాతీయజండాస్థాపనకు మిమ్ము ప్రభుత్వము వారు 144 సెక్షన్ క్రిందనిర్బంధించిరి. యిదిగో యీశాసనము ప్రకారము మీరురండు.

శ్రీహ;–అయ్యా యిదినాల్గవసారి మీనిరంకుశాధికారమున బానిసత్వము ననుభవించుటకన్న కారాగారవాసమే మావంటి గౌరవవ్యక్తులకు కర్తవ్యము. నడువుడు.

వాలం;–జైభారతమాతకుజై, జై శ్రీహరిరావుగారికిజై.
(అని నిష్క్రమింతురు)

3 వ రంగము

(కమలప్రవేశం– టేబులుపైనున్న ఆంధ్రపత్రికనుచూచి)

కమల;–శ్రీహరిరావుగారి అరెష్టు–రెండు సంవత్సరములుకఠినశిక్ష–అను శీర్షికను చదువును.

(పత్రికచూచిచదువును) జనవరి 26 వ తేదీ స్వాతంత్రదినోత్సవ సందర్భమున జండాస్థాపనకు, బ్రిటను నిరంకుశాధికారముగూర్చి

సభలో విపులముగా నుపన్యసించునందులకు శ్రీహరిరావుగారికి రెండు సంవత్సరములు కఠినశిక్ష ప్రభుత్వమువారు విధించి ఈరోజు సాయంత్రం 4 గంటలు మెయిలులో కడలూరు జైలునకుపంపించిరి. ( అని చదివి ) అనుకున్నట్లుజరిగినది. యింకమరిలాభము లేదు. నాసోదరీమణులలో భారతావనిని వనితాలోకమునకు ప్రబోధము గావించుటకు గడంగెద, అదియే నాపరధర్మము (అని లేచి లోనికిబోయి రంగస్థలముపై, భారతమాత విగ్రహము, గాంధీ పటములతో పూజావిధానము ప్రార్థన )

పాట :- కమల

భారతమాత, భాగ్యోపేత పాలింపుమము వరగుణజాత మాతా సుజాత॥ భారతమాత॥ హైందవజనములకాపాడంగల ఆది దేవతవు మాత॥ శ్రీభారత॥ అందరిమీయిలనొక్కటిగనై, హరి జనములు మనసోదరులైన పొందమేనే నీదేశస్వతంత్రము అందమె స్వరాజ్యసంపదలన్నియు, భారతమాత॥

కమల & వాలంటీర్లపాట :- గాంధీస్తవము ( నమోహిందమాత అనుమాదిరి )

1 నమోగాంధిదేవ, ప్రభావ, నమోశాంతిభావ
అమోఘమగునీదివ్యప్రభావము సమానమగు నీప్రేమవిధానము
2 భారతవీరులు సహాయులుగ, ప్రబలెడిరాట్నమె విష్ణుచక్రముగ
పోరాడెదవే వహింసవ్రతమున॥ నమో॥
3 భరతమాతనీభాగ్యదేవతట, నిరతసత్యమే నీమంత్రంబట,
కరుణారసమే నీవిలాసమట కరమ్‌చంద్రశ్రీమోహనదాస॥ నమో

(అని కమలపాడుచు) అమ్మా భారతాంబా ! నీవే నన్నీయుద్యమమున పాల్గొనజేసితివి నీకరుణాకటాక్షమే నన్నీ దేశసేవకు మార్గదర్శియయ్యె, తండ్రీ! గాంధిదేవా! నీయాశీర్వచనబలమే యీజాతీయసంస్థను పురిగొల్పినది యింక నేను ప్రతియింటను ఖద్దరుపరిశ్రమనుగూర్చియు, రాట్న ప్రభావము గూర్చియు ప్రబోధించెద ( అని వాలంటీర్లతో వీధులవెంటబయలుదేరును ) తెరతీయగానే

(రణభేరీ మ్రోగినదదిగోరా ! ఓ భారతవీరా ! అనువరుస)

1 జయభేరీ మ్రోగినదదిగోరా ! ఓ భారత పుత్రా !
భయమేమిక దేశముమనదేరా ! ఓ భారతపుత్రా !
2 గాంధిమననాయకుడేగదరా ! ఓ భారతపుత్రా !

హిందువులము మనజాతిసంస్థిదిరా ! ఓ భారతపుత్రా !
8 ఖద్దరుమనప్రాముఖ్యంబగురా ! ఓ భారతపుత్రా !
యిద్దరలోరాట్నమె కఠుణరా! ఓభారతపుత్రా! (అనిపాడుదురు)

కమ;— సీ॥ యేమహాత్ముడు రాట్నమే మన స్వాతంత్రి
సాధనంబని భువి చాటినాడో
యేమహాత్ముడు రాట్నమే మన స్వారాజ్య
సాధమార్గం బనజాలినాడో
యేమహాత్ముడు రాట్నమే యిల దారిద్ర్య
మును శాపునంచును యనినవాడో
యేమహాత్ముడు రాట్నమె లమిత్రోత్రిప్పిన
యదియెగతిణమని యనినవాడో

గీ॥ యట్టి శ్రీగాంధి దేవుని యాజ్ఞలెల్ల
శిరమునన్ దాల్చి రాట్నముచేతబట్టి
నూర్మితో త్రిప్ప నలువదికోట్లప్రజకు
కూడుగుడ్డకు యించుక కొరతగలదే?
(అనిచదివి) సోదరారులా ! మీాప్రిభోదమంకానిందు.

( 2 వాలంటీర్లు ) బొబ్బిలిపాటమాదిరి వరుస

జయము, జయము మాభారతమాతకు జయము దిగ్విజము,
జయము జయము మాగాంధిమహాత్మునికి జయము దిగ్విజయము
భారతదేశంబెల్లవారలకు ప్రాముఖ్యంబండి
భారతదేశంబన్నికళలకు భాగ్యోదయమండి,
భారతభూమిఎల్లపంటలకు ఫలదాయకమండి
భారతదేశంబన్నివిధంబుల పాతనమగునండి
అట్టిదేశమునబుట్టిన మనముఆలోచించండి
అట్టిదేశసాభాగ్యముగోరగ నదిముఖ్యంబండి
భారతావనిని బుటినవారము
భారతావనిని పెరిగినవారము
భరతవీరులని ప్రిఖలినవారము
భారతమంతా చదివినవారము
యీాదేశంబున దాశ్యముసేయుట కేల మనకు లెండి
మనస్వాతంత్రము మనదేశంబున గొనవలె నమ్మండి.

విదేశచదువులు విడువవలయును
విదేశబట్టలు వీడగవలయు
విదేశకోర్టులు వెతలేలండి
విదేశవస్తువు విధమేలండి
స్వదంత్రభాగ్యముగోరె మార్గము సరగజూడలెండి, రండి, జయ॥

కమ;— సహోదరీలారా! మనదేశము, మనభాగ్యము, మనస్వదంత్రము మనకుధాన్యముక్తి, మనబట్టమడిబట్ట, మనరాట్నము మనరక్ష. మానము, మనసోదరులు యీ నిరంకుశాధికారముగల తెల్లవారి ప్రభుత్వమును, తొలగద్రోయవలెను. రండు యింకొకచోట ప్రబోధము గావించవలయును.

పోలీసులు, యిన్స్పెక్టరు;— ఎదురుగా;— కమల, సహోదరులు;—

పోలీ;— అమ్మా నీ ప్రబోధము ప్రభుత్వ ధిక్కారమును సూచించు చుండుటవలన నిన్ను ఒకసంవత్సరము కడలూరు జైలునందు నిర్బంధింప ప్రభుత్వమువారి యుత్తరవుగాన గ్రహించి నడువుము.

కమ;— అయ్యా నేను భారతమాతపుత్రికను, గాంధీదేవుని శిష్యురాలను, దేశసేవకురాలను. స్వాదంత్రసమరమే నాముఖ్యలక్షణము, అది చేకూరువరకు నాపట్టుదలనువీడను, నాభర్తయనుసరించు మార్గమే నాకు శరణ్యము నడువుము.

వాలంటీర్లు;— జై భారతమాతకు జై, గాంధీకి జై, కమలాదేవికి జై



# స్వరాజ్య సాధము

## రెండవ అంకము

### 1 వ రంగము

రామమోహన్ ప్రవేశం

రామ;- ఆహా! కాలమెంత వైపరీత్యమైనది, పత్రికాముఖంబున శ్రీహరి రావుగారు, వారి ధర్మపత్ని కమలాదేవి కారాగారవాసులైనట్లు విదితమైనది. యింక యీ నిరంకుశాధికారపాలనవలన ఎందరు భారతవీరులు, ఎందరు భారతనారులు జైళ్ళకేగిరో ఎందరేగుటకు సిద్ధముగానున్నారో తెలియదు. 1920 సంవత్సరము పంజాబు దురంతములు విసిన కంటనీరుగార్చని భారతీయుడుండడుగదా! దురాత్ముడు, డయ్యరొనరించుదురంతములకు మేరలేదుకదా! గర్భిణీస్త్రీలను నేలపాలొనర్చిరి, పసికూనలనెత్తిపై బండలెత్తి పేరు గొట్టుమని దండించిరి, మహానాయకులను మారణయంత్రములచే మార్చిరి. యిప్పటికాఘోరకృత్యములు మరచినను మరపురావు కదా! ఎందరుమహావీరులు ఉరికంబములకెగబ్రాకిరో! ఎందరు మహావీరులు కారాగారవాసులైరో ఎందరు మహాయోధులు లాటీదెబ్బలదాటికోర్చిరో తెలియకున్నదిగదా! కానిమ్ము తల్లీ పాంచాలరాజ్యమా! నిన్ను దలంచిన గుండెలదరుచుండునుకదా! అక్కటా భరతదేశమాతా! మహాధాన యోధులగు నాయకు లుండియు నీకీ దుర్గతిపట్టుటకు పరరాజుల నిరంకుశత్వమే కదా కారణము కాకున్న —

సీ॥ భరతఖండంబు సంతోషభరితమగుచు
పాడిపంటలచే నిలభాసిలంగ
వర్తకము పేర నీతెల్లవారువచ్చి
చీలికలు జేసినారలు పాలనమున.

మహామహిమంబున శోభిల్లుచున్న భరతఖండంబున పూర్వవృత్తాంతంబులు పూర్వగాధలు స్ఫురణకువచ్చిన యెంత తారతమ్యముగలదు.

సీ॥ అగ్బరుయొక్క వైద్యాలయంబులు
గన్పింపవెయ్యది కారణంబొ!
రాచబాటలపక్క రాజిల్లుసత్రముల్
మచ్చుకులేవు యేమయ్యెనొక్కొ!
అలమహారాష్ట్రులు నిలిపెడికోటల
యందమదే మూలనడిగెనొక్కొ!
రసపుత్రవీరుల రాజిల్లుసౌధముల్
పరికింపనెచ్చోట దొరకవొక్కొ!
గీ॥ శిల్పులెందరు ముఖ్యమాసీమలందు
గట్టుగట్టడములు నేడుగానబడవు.
దీనికంతకు కతమేమి ? దేశమేలు,
శ్వేతముఖపాలనంబు విశేషమహిమ!
యింక యోచించుకొలది దేశవైభవంబు తారుమారైనదిగదా!
కావున.

సీ॥ బుద్ధునికాలాన పౌల్వారుయా యహింసా
పద్ధతులు హింససాధనమయె
అయశోకుని రాజ్యమందు నొప్పారెడి
న్యాయమార్గంబు యన్యాయమయ్యె
కవుల మన్నన లంది గణుతికెక్కిన
కృష్ణరాయపోషణ హూణరాజ్యమయ్యె
శ్రీ శివాజిరాజ్య సీమనుగల ధర్మ
పద్ధతులెల్ల విరుద్ధమయ్యె
గీ॥ విశ్వవిఖ్యాతినొందినవిజయనగర, సకలసామ్రాజ్యమేలుయా చక్రవర్తు
లాచరించిన పద్ధతులన్నియు గన మచ్చుకైనను లేవు యేమందుమింక॥

యీవిధముగ దేశమునగల పూర్వవిభవమంతయు క్షీణించినది. అయినను ప్రస్తుతము మన దేశదాస్య విముక్తికి కాంగ్రెసు పాటుపడుచున్నది. మహాత్ముడు నాయకత్వమువహించి కాంగ్రెసునెట్లు నడిపించు చుండెనో చూచెదముగాక!

సీ॥ కాంగ్రెసే యధికారగర్వంబునడగించి,
స్వాతంత్ర్యమిదునని చాటెనెవడు?

కాంగ్రెసే దాస్యశృంఖంబులన్. దెగగొట్టి
స్వాతంత్ర్యమిడునని చాటె నెవడు ?
కాంగ్రెసే దేశాన ఘనతవహించుచు
స్వాదంత్ర్య మిడునని చాటె నెవడు ?
కాంగ్రెసే ప్రజలందు కార్యరూపముదాల్చి
స్వాదంత్ర్య మిడునని చాటె నెవడు ?

గీ॥ అట్టి శ్రీగాంధి దేవుని. యానతులను
శిరమునన్ దాల్చి కాంగ్రెసు సేవజేసి
హిందుదేశ స్వదంత్రము నందకున్న
భారతీయునిజన్మకు ఫలితమున్నె ?

యిదియే నాముఖ్యాశ్యము, అదిగో నిన్నటి విషయ నిర్ణయసభలో ఉప్పుసత్యాగ్రహసమరముంగూర్చి విపులముగా చర్చగావింపబడినదట (1930) లో ఉప్పుసత్యాగ్రహ సమరంగూర్చి మహానాయకులతో, మహాత్ముడేమియోచించెనో, తెలియగలదు. ఆ తేజోమూర్తి దండి యాత్ర నుద్దండగతిని సాగించెనని వినవచ్చుచున్నది. ఆవిశేషముల న్నియు, మనకార్య నిర్వాహక సభ్యులగు జయప్రకాష్‌గారివలన తెలియనున్నవి.

(జయ ప్రకాష్ ప్రవేశం)

జయ;—అయ్యా రామమోహన్ వందనము.
రామ వందనము, వందనము, దయచేయుము.
రామ ఉప్పుసత్యాగ్రహవిశేషము లెట్లున్నవి.
దండయాత్ర మహాత్ముడెట్లుగావించెను ?

జయ;—అద్భుతముగా నూరుమైళ్ళదూరము మహాత్ముడు పాదచారియై సుమారు పదివేలుమంది దేశసేవకులతోను, మహానాయకశిరోమణులతోను దండివెడలునపుడుచూచితీరవలయును గాని చెప్ప నలవిగాదు వినుడు.

సీ॥ తుప్పించిముందంజ కొమరొప్పగా వేయ
కరతాళధ్వనులు నాకసముముట్ట
పైమీదజీరాడి పరిఢవిల్లుచునున్న
ఖద్దరుశాలువ కాంతులీన

కర్రినూతంగొని కార్యమూనెడి వేళ
బోసినోటను నవ్వు భాసిలంగ
భరత దేశము ధర్మపద్ధతినెలగొల్పు
గీతపాత్రంబును చేతబట్టి
గీ॥ సత్యవాక్పాలనమునల్పి సత్వరముగ
దండకారణ్యమునకేగు దాశరధుని
పోల్కి—శ్రీగాంధి దేవుడు పూజ్యతముడు
దండియాత్రకువెడలె నుద్దండగతిని.

రామ—వహవ్వా! మహానుభావుడు సంకల్పసిద్ధుడు. ఆయన చేయలేని కార్యమేది? ఆయనసాధింపరాని సాధనమేది? అహింసామార్గము చేతనే జగమునల్లాడించులోకోత్తరపురుషుడు, అవతారమూర్తి, అట్టిమహానుభావునకెదురెవరుచెప్పగలరు, యింకవిశేషములెవ్వి?

జయ;—విశేషములా! కుడి భాగము దేశభక్తుండును యెడమప్రక్క జవ్వానుండును అడుగు ప్రశ్నలకుత్తరమిచ్చుచు— చిరునవ్వున జవ్వానునగాంచి నీయభిప్రాయమేమనిన — జవ్వానుండు తాతను గాంచి — తాతా! యని యుల్లసించెను.

రాము;-యేమనివచించెనో కర్ణానందముగా దెల్పుము.

జయ;—యేమనియా ;—

చ॥ అరదమునాగనిమ్మ యిపుడాపకుమమ్మ దలంపవేదకున్
కరువయె నుప్పు, గంజియును, కట్టగబట్టయులేదు, నమ్మ — యి
క్కరణిని వేగరమ్మ గుణవారధివి గాంధివి నీవనుమ్మ, నీ
చరణమునమ్మి యీలవణసాగర హక్కులు దెచ్చియిచ్చెదన్.
అనివచించెను. పిమ్మట ఉప్పుసత్యాగ్రహసమరంబును మహాత్ముడొనరింప ప్రభుత్వమువారికి గుండెలదరిపోయి మహాత్మునితో సంధిని గావింపగడంగిరి.

రాము;—యెవరెట్టిసంధిగావించిరో దెల్పుము.

జయ;—గాంధీ యిర్విన్ సంధిగావించి ఉప్పుపై పన్నుండరాదనియు అది సముద్రప్రాంతముననున్న వారువారి గృహోపయోగముల నిమిత్తం వండుకొనవచ్చుననియు మొదలగు 17 షరతులతో సంధిగావించిరి.

రాము;-" జైమహాత్మాగాంధీకిజై " వుప్పుసత్యాగ్రహ దీక్షకుజై ,(అని)
మహాత్మగాంధిదేవ నీసంకల్పము అమోఘము, నీవాక్యము,

అద్భుతము తండ్రీ. సత్వరమే స్వరాజ్యసంపాదనకు మార్గముజూపి యీదాస్యపరిభుత్వమునుండి విముక్తిగావింపుము. అట్టిశక్తిసామర్థ్యములు మాకొసంగుము.

జయ;—అయ్యా! రౌండుటేబులు కాన్ఫరెన్సుఫలితములు మీకు తెలిసినవే గదా!

రామ;—తెలియకేమి, అన్నియునొసంగెదమని దగ్గరకుబిలిచి దాసరీ సీకన్నులొట్టలనునట్లు యెప్పటిపాఠమే మనకు వారప్పగించిరి, కాకున్న వా రాచరించుదురంతములకు మేరలేదుకదా! జూడుడు,

సీ॥ లండనులోపల రౌండుటేబులు సభ
ఫలితంబుగనగ నిష్ఫలితమయ్యె
రాయబారులనంపి రాజ్యమిచ్చెదమన్న
తొలిపలుకులన్నియు దెలియబడియె
ఏదియోకొంతమీకిచ్చెదమని బల్కు-
మాటలన్నియువట్టి మాటలయ్యె
యింపుగాబల్కెడి సంప్రదింపులుగూడ
వివరింపనది లోకవిదితమయ్యె

గీ పెదవులకుబెల్లమున్ రాసి మెదపకుండు
తీపిమాటలపద్ధతి తెలియబడియె
యింకస్వాతంత్రమిడుటకు యిష్టపడుట
వొప్పుకొనబోరు, యెవ్వరు, యోర్చుకొలది
కఠినశిక్షలు గావింప గడగినారు.

జయ;—అవునుగదాయింకవారితో మనకేమిపని, మననాయకుండగు గాంధి దేవునియాజ్ఞ ఆదర్శమే మనముఖ్యలక్ష్యము. యిదిగాక జాతీయవాదులు శాసనసభలను బహిష్కరించి 15 సంవత్సరములు గావచ్చినది; తాత్కాలిక శాసనసభలందు, దేశములోనున్న జమీందారులందరును ప్రవేశించి సమస్తమువారిదేయని స్థానిక పాలనంబులుసహితము తమచేతనుంచుకొనిరి. గావున కార్యనిర్వాహకసభ్యులు రేపువచ్చు 1937 సంవత్సరం జనవరిలో జరుగబోవు శాసనసభలందుకాంగ్రెసువాదులు ప్రవేశింపవలెననియు, వారివారిస్థానములయందు అభ్యర్థులుగానుండవలయుననియు నిర్ణయించిరి, గావున విషయనిర్ణయకార్యనిర్వాహకులయాజ్ఞను ఎల్లరంగీ

కరించిరి. యింక మనము కార్యరంగమున ప్రవేశింపవలసియున్నది. యిప్పుడు జస్టిసువారలది ఎర్రపెట్టియని ఓటులకై నిర్ణయించిరి. మన జాతీయవాదులది పసుపురంగుపెట్టెయని నిర్ణయింపబడెను.

రామ;- పసుపురంగుశుభప్రదము అందులకే మనవారాపెట్టినెంచిరి. కానిండు,జాతీయవాదుల కనుకూలముగా వాలంటీర్ల సహాయమున ప్రచారముగావించుటకు పూనుకొందమురండు.

## 2 వ రంగము

### (ప్రవేశం) వాలంటీర్ల పాట

1 పచ్చపెట్టిలో యోటిడకుంటేబ్రతుకుసుఖంబేదీ
ముచ్చటదీరెడి ముద్దులయోటు, అచ్చమైనమనహక్కుల
ఓటు, హెచ్చుస్వతంత్రమునిచ్చెడి యోటుయిచ్చకములకై
మోసపోకనా॥ పచ్చ॥

2 జాతీయవాదులునిల్పెడిపెట్టె, జాతిసంస్థనుగెల్పెడిపెట్టె
నీతిక్ ఖ్యాతికిమూలముగావున, నిల్పిరి పచ్చనిరంగులపెట్టెను,
పచ్చపెట్టెలో యోటిడకుంటే బ్రతుకుసుఖంబేది,
(అనిపాడి) "జై జాతీయవాదులకుజై" కాంగ్రెసువారికిజై,
"పసుపురంగులపెట్టెకుజై"



# స్వరాజ్య సాధము

## మూడవ అంకము

### 1 వ రంగము

(జస్టిస్ జగ్గయ్య, లంచాల రామన్న ప్రవేశం.)

జగ్గ;— రామన్నగారూ! మీవార్డులో, మీ చేతిలో చాలా ఓట్లున్నవి, అవి మా పార్టీకి చెందిన మన జమీన్‌దారుగారికి యిప్పించాలి యేమంటారు.

రామ;-సిత్తం. గాని జగ్గయ్యగారు నాదొకమాట.

పాట;- నిక్కముగ సెబుతాను నీకిచ్చుతానోటు
సక్కగ మీరియ్యాల సల్లగ నాకొకనోటు
కారుపై నెక్కించి — కాఫీనాకిప్పించి
కమిటీలలో నన్ను గౌరవించాలంటి॥ నిక్క॥
విందు తిండిలో నన్ను ముందు కూరుసోబెట్టి
అందరికన్నా నన్ను అధికంగా సూడాలి॥ నిక్క॥

జస్టిస్ జగ్గయ్య;—అందుకబ్యంతరం ఏంటి గాని రామన్నా! అభిమానం అచ్చయ్యగారి చేతిలో చాలా ఓట్లున్నాయని విన్నాం, అతడు కాంగ్రెసు అభిమాని, కాంగ్రెసు కాంతయ్యగారికి యివ్వదలచుకున్నాడు మనం కాస్త చెయ్యితడిసే స్తే మన వైపు తిరిగి ఓట్లు వేయిస్తాడేమో! కనుక్కొందాం, రా?

రామ;—పందండి ఆరింటికి,

### 2 వ రంగము

(యిల్లు;-అభిమానపు అచ్చయ్యగారు కూర్చుందురు) లంచాల రామన్న జస్టిస్ జగ్గయ్యగార్ల (ప్రవేశం).

జగ్గ;— అచ్చయ్యగారు నమస్కారము

అచ్చ;-దయచేయండి నమస్కారము.

జగ్గ;— మేము వచ్చిన పనియేమో! రామన్నగారు చెబుతారు.

అచ్చ;-చెప్పక నాకు తెలియును లెండి అయినా చెప్పండి.

జగ్గ;— మీ చేతిలో చాలా ఓట్లున్నాయి మా పార్టీకి యిప్పించాలని మా కోరిక, మీ యిష్టానుసారం నడుస్తాం.

అచ్చు:—నేను డబ్బు కక్కూర్తి మనిషినికాను నాసంగతి మీకు తెలియును. కాంగ్రెసుఅభిమానిని, మీసంగతి నాకు యిదివరకే తెలియును, కారణంఏమంటే యిదివరలో మీరు, మీపార్టీఅన్నమాటలు వింటే ఆశ్చర్యం, ఆక్షేపణకూడావస్తుంది, పైకంటె ఘాటైన కూడాను — చెబుతావినండి.

సీ॥ స్వారాజ్యసంపద గోరుచుంటినిగాన
ఓటునిమ్మనెడి యుద్యోగియొకడు
మీగ్రామములకును మించురోడ్లను వేయు
నభిమానినని ఓటు నడుగునొకడు
ముసలైననిండ్లకు విసుగక నోట్లకై
మోటారుపై బోవు మేటియొకడు
అక్షరజ్ఞానమున్నైన లేకున్నను
యబ్యర్థిగానిల్చి యడుగునొకడు

గీ॥ అక్కరందీరునరకిట్టి నక్కవినయ
ములనుగావించి ఓట్లకై ముందునిల్చి
పదవిచేకూరునంతనె పల్కరింప
రగుపడరుమాటలాడరు యహహమీరు!

కావున నేను కాంగ్రెసువాదిని కాంగ్రెసుకాంతయ్యగారికే నాఓటు నివ్వదలంచితిని నన్నాశ్రయింపక మరలుడు.

లంచాల రామన్న:—ఏమిటయ్యా! యీ శ్రీరంగనీతులు చాలామందిని సూసేం, ఓటంటే యీరోజుల్లో యేటనుకున్నావ్, ఓటంటే రూపాయలమూట, యిందనాల్గువందలు పుచ్చుకో, మనజస్టిస్ జగ్గయ్యగారికియ్యవయ్యా నీనోట్లుయింకసూస్తావ్. ఓటంటే-ఏటో తెల్సునా!

పాట (ధనమే ప్రపంచలీల అనువరుస)

ఓట్లే ధనాలమూట, ఆహా, ఓటే ధనాలమూట,
ఓటులకై నోట్లు, ఆపై నికాటలాట్లు
ఆమీద ప్రజలపాట్లు, యిదివినుమా, మదిగనుమా, ఓటు
గైకొనుమా యీనోట్లుమూట, ఆహా ఓటే ధనాలమూట॥

అచ్చు:—రామన్నా యీవ్యక్తి డబ్బుకాసపడువాడు కాడు, కేవలం దేశ సేవయే పరమావధిగా నెంచుధీరుడు, యీసాకులు నావద్దచెల్లవు (నిష్క్రమింపుదు.)

జగ్గ;— రామన్నా మర్నాకదగ్గరకుపోదాంరా, యితడు ఎన్ని చెప్పినావినడు.
లంచా;-పదండిబాబూ, కూడుసల్లితే కాళ్ళలురావా! మనడబ్బేమనకి స్థాయి ఓట్లు నడండి (అని నిష్క్రమింతురు)

3 వ రంగము (కాంగ్రెసు గెలుపు)

జయ;—(పత్రిక చేబూని) ఏడు రాష్ట్రములలోనున్న జమిందారులు భూస్వాములు ఓడిపోయిరి. కాంగ్రెసునకు అఖండవిజయంసంప్రాప్తించెను. (పత్రికమూసి) మహాత్మగాంధిదేవా !యిదియంతయునీమహిమ.
వాలం—అయ్యా శ్రీ హరిరావుగారు, వారిభార్యకమలాదేవిగారు నిన్ననే విడుదలయ్యారు. మీావద్దకు యిప్పుడేవస్తున్నారు. (నిష్క్రమణ)

శ్రీ హరిరావు, కమల ప్రవేశం.

జయ;—ఇదిగో శ్రీహరిరావు దంపతులకు వందనశతంబులు.
శ్రీహ;—అయ్యా మా నమస్కారములందుడు.
జయ;—శ్రీహరి రావుగారు, కాంగ్రెసునకు అఖండవిజయం సం ప్రా ప్తిమైనది. వింటిరికాదా !
శ్రీహ;—కాకున్న భూస్వాములు, జమీాందారులు ప్రజాభిమానముగోలుపోయిరి. పచ్చపెట్టెపభావము యెల్లచోట్లప్రబలి పెట్టెలయందు కాళీయిన్నది లేక వేలకొలది ఓట్లతోనిండిపోయెను.
జయ;—జమీాందార్లకు, భూస్వాములకు గుణపాఠమెట్లుచెప్పిరి.
శ్రీహ;—యేమని చెప్పిరో వినుడు.

సీ॥ జట్టిసా నీయాట సాగదు సాగదు
తొలిగిపొమ్మింక మాతలపుమాని
భూస్వాములార మీాపోకడల్ చెల్లవు
యిలజమీాందారులు యేకమైన
పచ్చపెట్టెయెమీాకు భవ్యతరంబుగ
గుణపాఠమున్ దెల్పె ఘనతకెక్క
అధికారవర్గమాయాసలు విడువుడు
పనికిరావింక మీాపట్టుదలలు
పీపుల్సుపార్టిమీా యోపికచాలింపు
యింకనీవేషములెల్ల దెలసె

గీ॥ అఖిలసామ్రాజ్యలక్ష్మి మాయందునిల్వ
పచ్చజెపహ్వారులాలు నవ్వానినాప

నెవరికశక్యమువానికి నెదురుగలదె
మాయ లల్లినచెల్లవు మరలిపొందు॥
అనినంతనె జమీందార్లుగుంటెలదరి గోడలకుచేరబడిరి.

జయ;—చేరబడక వారిలోనేమున్నది? పిమ్మట యేమగును?

శ్రీహ;—మనవారుమంత్రులు. నా యేడురాష్ట్రములలోని స్థానంబులునలంకరింతురు.

జయ;—జై! కాంగ్రెసుమంత్రులకుజై! భారతమాతకుజై!

(తెర వ్రాలును)



# స్వరాజ్యసాధము

## నాల్గవ అంకము

( రామమోహన్ ప్రవేశం )

### 1 టవ రంగము

రామ;-అక్కటా యుద్ధపరిస్థితి అధికమైనది. హిట్లరు దురంతములకు మేర లేదు. ఎన్ని బాంబులు తయారుచేసెనో ఎంతసైన్యము చేకూర్చెనో ఎన్ని టార్పెడోలను సమకూర్చెనో ఎవ్వరెరుంగుదురు?

సీ॥ మరఫిరంగులగుండ్లు మారుమ్రోగగజేసి
చల్లగా పోలండు కొల్లగొట్టె
బాంబులవర్షంబు ప్రజ్వలింపగజేసి
ఫ్రెంచి దేశము నాక్రమించుకొనియె
రెక్కలబాంబులు మిక్కుటంబుగ పంపి
లండనుగడగడ లాడజేసె
నాజీ ప్రభుత్వంబు రాజీ రాదంచు
హాలండునంతయు నాక్రమించె

గీ॥ యింక నార్వేను స్వీడను, యెంచిజూడ
వరలు డెన్మార్కునంతయు వశముజేసె
మెరుపుయుద్ధముగావించి మించుశక్తి
జూపుచుండును హిట్లరు జూచుకొలది.

శ్రీహరిరావు ప్రవేశం.

శ్రీహ;—అయ్యా! రామమోహన్ యుద్ధపరిస్థితులెట్లున్నవి?

రామ;—యెట్లుండవలయునో అట్లేయున్నవి. హిట్లరుదురంతరములకు మేర లేదు. మెరుపుయుద్ధముగావించి లోకమంతయు అల్లల్లాడించుచున్నాడు.

శ్రీహ;—కర్తవ్యంబేమి.

రామ;—యేమి మహాత్ముడు చెప్పదలంచెనో తెలియదు.

( కమల ప్రవేశం )

కమల;-అయ్యా? నమస్కారము.

రామ;—అమ్మా! యిటుకూర్చొనుము.

కమల;– రామమోహన్ వర్యా! నిన్నటివిషయ నిర్ణయసభలో జరిగిన చర్చ లద్భుతమైనవి.

శ్రీహ;–కమలా ఏమది ?

కమల;.ఏమా మహాత్ముడు విదేశీయులు నిరంకుశాధికారులగు బ్రిట నువారు మనకాంగ్రెసు మంత్రులను యీ యుద్ధపరిస్థితిని సహాయ మొనరింప వేడిరి.

రామ;–అందులకు వారేమనిరి.

కమల;–అనవసరముగా మీరుయుద్ధమున మాభారత దేశమును దింపి సహా యమును కోరుచున్నారు. గావున మాకు వాక్స్వాతంత్రమైన నిచ్చినగాని సహాయముచేయమనిరి. పిమ్మట యుద్ధానంతరము మీకుస్వరాజ్యమిచ్చెదనని వాగ్దానము గావింపవలెననికోరిరి.

రామ;–అందులకువారేమనిరి.

కమల;–స్వరాజ్యము మాటతలపనేలేదు కదా ? వాక్స్వాతంత్రమునకు గూడా అవకాశమునీయమనిరి.

రామ;–యెంతదౌర్జన్యము.

శ్రీహ;–అదివారికి మొదటినుంచియు అలవాటేగదా ?

రామ;–అట్లైన మహాత్ముడేమిగావింపదలంచెను.

కమల;–వ్యక్తిగతమగు సత్యాగ్రహ దీక్షనుబూని యీ బ్రిటను వారి ద్రవ్యముగాని మనుష్యసహాముగాని చేయవలదని – వినోభాచేత మొదటిసత్యాగ్రహాము ప్రారంభింపసేయ మొదలిడుటకు తీర్మా నించిరి. అతడు క్విట్ ఇండియా తీర్మానమును బొంబాయిలో సాగింపబూనెను.

శ్రీహ;–అదేమది ?

కమల;–యేమా ! సంపూర్ణమగు స్వరాజ్యము వారీయరు యివ్వదలంచు కొనలేదు గాన మహాత్ముడు తెల్లవారిని మూట ముల్లె గట్టుకొని మనభారత దేశమువదిలి పొండని నిష్కర్షగా చెప్పదలంచె.

రామ;–వహావ్వా! మహాత్మా! నీధైర్య స్థైర్యములు అద్భుతములు నీవ్రత దీక్ష అమోఘము.

కమల;–యింకమరి క్రిప్పురాయభారమంతయు తేట తెల్లమైనది. మన మెరింగినదే

రామ;–అదిచెప్పకనే తేటతెల్లమైనది.

శ్రీహ;_ఔను క్రిప్సుదిబ్బ తనరిప్పుకవచ్చెనుగదా ? వానితో సంప్రదించుటకు రాయబారము యేదియును లేదు. అవతల మైనార్టీ పార్టీయనియు, యివతల జమీందారీపార్టీయనియు, అటుప్రక్క జిన్నాపార్టీయనియు, యింకొకవంక హిందూపార్టీయని యేవోవోకల్పించి అందరిని రావించి, వారివారితో సంప్రదించి, మీరాతగువులు, పరిష్కరించుటకు మీలోమీకు చీలికలుగానున్న అభిప్రాయముగలదని, మనమనకపూర్వము అతడే చీలికలు గల అభిప్రాయములుకల్పించి యేవోసాకులుజెప్పి తుదకు మనపాశమే మన కప్పగించి తన త్రోవను వెడలిపోయెను.

శ్రీహ;_ఔను వారిమతము మొదటినుండియు చీలికలుగావించుపద్ధతియే యని అందరెరింగినదే అదివారికలవాటు కాకున్న

ఉ॥ అంపిరిరాయబారులను, యన్నిటమేలొనగూర్తుమంచుబల్,
తెంపఘలట్టుబల్లి కక్కురతయాశల నెన్నొజూపి వారలా
పంపిణిరాచపద్ధతుల, పల్కిన మాటలు వ్యర్థబుచ్చి యీ
కుంపినిరాజ్యపాలనమె, గొప్పగనిప్పు ముదెల్పినారకో

కమల;-యిదివరకు సంప్రతింపులు కన్న క్రిప్సురాయబారమంతకన్న గొప్పదియా ? అతడు లండనునుంచి వచ్చినప్పుడు యేభారమును మూటగట్టి సందేశములు తేలేదు. వెడలునపుడుమాత్రముహిందూదేశమునుండి రాయభారముమాత్రము మోసుకొనిపోవునంతటి భారముగా యేమిమూటగట్టుకొని లండనులో నీమూటనువిప్పి చెప్పగలడు. వారికంతే ? మనకింతే ? మిగులు.

రామ:_బాగాచెప్పితివమ్మాకమలా!

శ్రీహ;_యింకమనము వ్యక్తిగత సత్యాగ్రహముసల్పవలెను. గాన సిద్ధపడుడు.

కమల;_ఆపని నెరవేర్చుటకే సిద్ధముగానున్నాను.

శ్రీహ:_కమలా, యిదివినుము, అనవసరముగా మన దేశమును, యీ ప్రస్తుతయుద్ధపరిస్థితులలో సహాయముచేయజాలమని మనరాష్ట్రములలోని మంత్రులందరును పదవీవ్యామోహములనువీడి రాజీనామాలనొసంగిరి.

రామ;-సెబాస్, సెబాస్, వారలకు పదవులయందు వ్యామోహమన్నది యుండినకదా ? పదవులు వ్యామోహము_ అదిలేకుండుటవలననే

రాజీనామాలనిచ్చిరి.

శ్రీహ;—దీనిపై గాని బ్రిటనువారికి వేడిపుట్టదు.

కమ;— యిప్పుడు వేడి పుట్టి 106 డిగ్రీలకుపైగాపై కుబుకు చున్నదని మీకు తెలియగలదు. జూచుచుండుడు.

శ్రీహ;—కమలా —యింక ఆలోచనయేల? వ్యక్తిగత సత్యాగ్రహమునకు గడంగవలయునుగాన — మహాత్మునియాజ్ఞల నుల్లంఘించక, త్వరపడుదము రమ్ము.

కమ;— సత్వరమేరండు — ( అని నిష్క్రమింతురు )

2 వ రంగము — రామమోహన్ ప్రవేశం

రామ;-శ్రీహరిరావు, వారి ధర్మపత్నియగుకమలయు, వ్యక్తిగత సత్యాగ్రహమొనరించి జైలునకంపబడిరి. కానిమ్ము యింకపై విశేషములన్నియు నిన్నటిసభలో యేమి చర్యలుగావింపబడెనో తెలియగలవు. అదే జయప్రకాష్‌గారు దయచేయుచున్నారు.

జయప్రకాష్ ప్రవేశం

రామ;-అయ్యా! జయప్రకాశా, నమస్కారము.

జయ;—నమస్కారము —

రామ; దయచేయుడు.

జయ;--( కూర్చొనును )

రామ;—వ్యక్తిగత సత్యాగ్రహమువలన గల్గుఫలితములేమైనవి. మహాత్ముని సంగతేమున్నది ?

జయ;—హిట్లరు అనవసరముగా రష్యారాజ్యములతో యుద్ధముకల్పించుకొనినందువలన సంపూర్ణముగా యపజయమునందియోడిపోయె: — అమరుచటి దినమే జవానుసహితము, యుద్ధముగావింపమని చేతులెత్తిరి.

రామ;—యింక యీపీడవదలినదన్నమాట. యింక దేశమునకు శాంతిభద్రతలు కలుగవచ్చును.

జయ;—యింకవిశేషమేమన — మహాత్మునిజైలునుండి బేషరతులుగా వదలివేయుటయేగాక, శ్రీహరిరావుగారిని వారి ధర్మపత్నిని మహానాయకులును, జైలునుండివిడువబడిరి.

రామ;-పిమ్మట యేమిజరుగునున్నదో ?

జయ;—ఇంగ్లండులో మనకు ముఖ్యప్రధానిగానుండు చర్చిలుగారికి అట్లీ

దొరగారికిని ప్రధానత్వముగూర్చి పోటీలుగావింపబడినవి.

రామ;—చర్చిలు మహాశయుని సంగతేమైనది ?

జయ;—యేమైనదో, అదియేమైనది. అట్లీదొరగారికి పోటీగా నిల్చిన చర్చిలు మహాశయుడు యోడిపోయి, కష్టాటితాగుచూ, ఇలిపోనుగొట్టమునకు చేరబడెను.

రామ;-వహావ్వా! భగవంతుడేమిజేసినను మేలుకొరకే అనునట్టుజరిగెను.

జయ;—గాని రామమోహన్! మనకొశుభసందేశము. లేబరుపార్టీ నాయకుడగు, అట్లీదొర మనకు శుభసందేశమంపెను.

రామ:-జయజయము, జయప్రకాశా, నీనామము సార్థకముగా, మనజయమునకు శుభసూచికముగా విజయవార్తనుదెల్పుము.

జయ:—మనకు బ్రిటిషువారు హిందూదేశమును, పాకిస్థాన్, యిండియన్ యూనియన్లుగా విభజించి అధి నివేశప్రతిపత్తి పరిపాలన మొసంగిరి అనగా తక్కినదేశమువలెనే మనకు మనలను పాలించుకొను అధికారముకలిగినది.

రామ:-సెబాస్ మహాత్మా! నీయుద్యమము అమోఘమైనది. నీపూనిక పరిపూరితమైనది. నీదివ్యప్రభావము కొనియాడదగినది, అని, జయప్రకాశ్ అదివారు మనకిచ్చునిర్ణయమెప్పుడు?

జయ:—ఎప్పుడోయనసేల 1947 ఆగష్టు 15 తేదీనాడు వారు సర్వహక్కులనువదలి మనదేశమునువీడి మనకు స్వతంత్రమొసంగితిమని సందేశమంపిరి. యిక మనజాతీయ పతాకములు స్వేచ్ఛగా ప్రతి అధికార భవనములయందును పాఠశాలలయందును నిల్పి హిందూదేశ స్వతంత్రవిభవమునుగూర్చి యుత్సవములుగావింపవలెనంటిరి.

రామ:—“జైమహాత్మాగాంధీకిజై” “భారతమాతకుజై” “హిందూదేశస్వతంత్రస్థాపనకుజై” అని జయప్రకాశ్ యింకఆలస్యము సేయక స్వరాజ్య చిహ్నంబగు త్రివర్ణపతాకమును నిల్పవలయును రమ్ము పోవుదము. అని నడచుచుండ, ఎదురుగా శ్రీహరిరావు కమలవాలంటీర్లు వచ్చుచుందురు.

రామ; అదిగో మనసోదర, సోదరీమణులగు శ్రీహరిరావుగారు వారి ధర్మపత్నిమొదలగువారితో యిటేవచ్చుచున్నారు. యింక స్వరాజ్య స్థాపనకు త్రివర్ణపతాక మహోత్సవమునకు వేళయతిక్రమించుచున్నది. రండు త్వరగాపోవుదము ( తెరవ్రాలును )

# 3 వ రంగము

(తెరతీయగానే పచ్చనితోరణములతో జండాస్థాపనకు శ్రీహరి రావు, కమల, రామమోహన్, జయప్రకాస్, వాలంటీర్లు మొదలగువార్ల ప్రవేశం 1947 ఆగస్టు 15.)

రామ:-మహాజనులారా ! సోదరసోదరీమణులారా ! మనలను పాలించు పాలకులు బ్రిటనువారు నేటికి 60 వది యేండ్లనుండి మనమాసించుచున్న మనప్రజారాజ్యము, మనదేశస్వాదంత్రము యీనాటికి చేకూరినది. జాతీయోద్యమమునపాల్గొని మనలో అనేకులు, అనేకకష్టములకు గురియైనను ఈనిరంకుశాధికారమునుండి తొలగింపబడు మహాసూత్రమును, మహానుభావుడును, అవతారమూర్తియు, నిరుపమాన సత్యవ్రతదీక్షాపరుండగు మహాత్ముని కృపారసమువల్లనే మనకీస్వదంత్రము లభించినదనుటలో అతిశయోక్తిగాదు, నేను మన భరతదేశము ప్రాముఖ్యతవహించి మనజాతీయపతాకము ముద్దులొల్కు మూడురంగులతో ముచ్చటగా ప్రతిభవనములయందు నుపాంపబడుట శుభసూచకము, శుభోదయము. యిట్టిఅవకాశము నేడుగల్గినందులకు మహాత్ముడు మనకొసంగు అమృతభాండమగు యీస్వరాజ్యమును భద్రముగాకాపాడుకొని అతడాచరింపబూనుపద్ధతులను ఆదర్శనీయముగానుంచుకొని పరిపాలనావిధానముగావించు భాద్యత మనది' గావున మనలో ఐక్యత చెడనీయక ధైర్యస్థైర్యములతో మనదేశగౌరవమును మనజాతీయకేతనవిభవమును గమనించెదరుగాక. నా యుపన్యాసము యింతటితో ముగించుచున్నాను.

వాలంటీర్లు :— "జై భారతమాతకుజై" స్వదంత్రస్థాపనకుజై స్వరాజ్యపతాకమునకుజై "గాంధీమహాత్మాకిజై"

జయ:—అమ్మా ! కమలా నీవే యీపతాకమహోత్సవము జరుపుము.

కమల; ( చిరునవ్వునవ్వుచు, జండాస్థాపనగావించి.)

గీ॥ ఎంతకష్టించి తెచ్చితో, యీస్వరాజ్య
సౌధరాజంబునీదీక్ష సాధనంబు
వలన గాకున్న యబ్బునే ఫలితమిపుడు
వందనమునీకు శ్రీకరచంద్రుగాంధీ ॥

## 25

### పాట

1 శుభోదయము, శుభోదయము, శుభోదయము నేడిదే
విభవము స్వరాజ్యము; విమలతరము గాంధిమతము శు॥

2 మనరాజ్యము మనవిభవము; మనధర్మము మనకు సుఖము,
" శుభోదయము " శుభోదయము. నేడే॥

3 మనపతాకసౌభాగ్యము, మనకతి యానందకరము,
ఘనతమీరస్వాతంత్రము గాంధిదేవుడొసగె మనకు శుభో॥

4 మంగళము మహాత్మునకు, మంగళము స్వరాజ్యమునకు
మంగళము స్వతంత్రమునకు, స్వరాజ్యకేతనముకు శుభో॥

సమాప్తి.

